# బానిసత్వం

## ( Bondage )

రచయిత : శ్రీ జంపన

ప్రాప్తి స్థానం:
ఘనిబిల్లి నూకరాజు,
బుక్సెల్లర్సు,
౧ చిపేట, బెజవాడ

8 అణాలు

౧

అందం ఎక్కడుంటుందో ఆనందం అక్కడే ఉంటుంది ఆనందం ఎక్కడుందో ఆత్మీయసౌందర్యం అక్కడే ఉంటుంది ఆత్మీయసౌందర్యం ఎక్కడుంటుందో అక్కడే భగవానుని చిది లాసం రంగులు దిద్దుకుంటూ ఉంటుంది.

నిర్మల ఆనందమయి; అనురాగమయి, ప్రకృతిలో ప్రతిపుష్పం ఆమెను చూడగానే రెక్కలు విప్పుకొని దివ్య నృత్యం చేస్తుంది. ఆమెను దూరదూరాలనుంచే, కొమ్మచివ లనుంచి కోకిలచూచిందా అంటే 'కుహూ కుహూ కుహూ' అని ఆహ్వానిస్తుంది.

ఆమె పరికిణీ పావడా ఎదురుగాలికి రెపరెపా కొట్టు కుంటూ ఉంటే, మల్లెపొదరింటిమాటున చూచే నెమలి ఒక్క సారి తనఫించాన్ని విప్పి 'తకిట తకిట' తం ధకిటధకిట' అంటూ నృత్యం చేస్తుంది.

ఆమె తోటమధ్యకు వచ్చి, పాడుకుంటూ పావురాయిల వద్దకు వెళ్ళిందంటే అవన్నీ ఒక్కసారిగా కిలకిల ఎందుకో నవ్వుతాయ్. నిర్మలను నవ్విస్తాయ్.

నిర్మలంటే కన్నతల్లిదండ్రులకే అనురాగం కాదు; అందరికీ అనురాగమే. నిర్మలతో స్నేహం చేయాలని ప్రయ త్నించేది మగవాళ్ళేకాదు; ఆడవాళ్లుకూడాను.

నిర్మల ఇంట్లోవుంటే ఆమెచుట్టూ జేరతారు బంధు మిత్రులు. తోటలోకి వెళ్ళిందంటే ఆమెచుట్టూ జేరతాయి పశుపక్ష్యాదులు. ఇదంతా చూస్తూ ఉన్నాడు తోటమాలి రామన్న 'ఆమెలో ఏంశక్తి అంతమందిని ఆకర్షిస్తుందా? అని అనుకుంటాడే కాని ఎన్నడూ మాట్లాడి ఎరుగడు.

"నిర్మలా! నిర్మలా! నీకళ్ళల్లో ఏం కమ్మదనంఉందో, నీతోనే ఉండాలని ఉంటుందెందుకో! నీకళ్లే గూళ్ళయితే నేనో పిట్టనయి వానిలో ఎప్పుడూ గుండెరెక్కలు ముడుచుకొని కూర్చునేవాణ్ణికదా! నిర్మలా! నీవు పాదంతీసి పాదంవేసే సరికల్లా పచ్చగడ్డి ఎఱ్ఱని పూలనుతొడిగినట్లు, ఎఱ్ఱపడుతుందే- ఆగులాబీ రంగులవంటి నీపాదాలలో, నాగుండె నెత్తురు ముగ్గులు పెట్టుకుంటే ఎంత బాగుంటుంది? నీవు నిజంగా ఈ లోకానికి చెందిన దానివేనా? లేక - ఏస్వర్లోకనందన పారిజాతాలకో చెందిన సుందరివా?

నిర్మలా! నీమాటల్లోని మాధుర్యాన్ని ఆస్వాదించడానికి ఈపేదజీవి నోచుకోలేదుకదా! నీనుంచి- నీచూపుల తీపినుంచి- నీపాదాల రంగులనుంచి- నీహృదయపు పొంగుల నుంచి- నన్ను వేరుచేసింది నాపేదతనమేకదా! లేకపోతే... నీతోనే...ఎందుకులే. నాగొంతెమ్మ కోరికలు." అని అనుకుంటూ నిర్మలను కన్నీటి పొరలను తోచుకుంటూ చూచేవాడు, ఆమెవెళ్లేవరకూ మనరామన్న.

రామన్న పొడగరి; కండలుతిరిగిన శరీరం. చక్కని ఛాయ. సూదుల్లా కొనలు తేరిన కళ్లు- వంకీతల- నడియావన పాదుర్భావం- తీయనిగొంతుక- చల్లనిమనసు.

పూవులు పూయించటంలో రామన్నది అందివేసిన చెయ్యి. పొదరిళ్ళను వివిధరకాలగా చిత్రిస్తూ ఉంటాడు.

రామన్నంటే 'మెత్తనిమనసుకలవాడు' "తీయనిగొంతు కలవాడు' అని ప్రతీతి. రామన్నను రోజూ విడవకుండా చూస్తూనే ఉంది నిర్మల.

"రామన్న ఎంతమంచివాడు! ఎంత చక్కనివాడు!" అని వంటనిండా కళ్లుచేసుకొని చూస్తూఉండేది. ఎప్పుడైనా అతడుకూడా ఆమె చూపుల్లో తన చూపులను కలిపితే, నిర్మల హృదయం ఝల్లు ఝల్లుమనేది. దానితో వేయివేల రామన్నలు తన హృదయంలోనుంచీ తిరిగి, తీయని గానం చేస్తున్నట్లుంది.

"రామన్నా! మరచిపోదామన్నా మరపురాని నీశరీర సౌష్టవం; మధుర స్వప్నాలలో నన్ను తేలించి లాలించే నీ యావన సౌందర్యం; క్షణక్షణం నాకు చక్కిలి గింతలుపెట్టి కవ్వించి నవ్వించే నీకన్నుల లావణ్యం; అబ్బా! ఎలా మరచి పోవడం.

రామన్నా! మొనలు తేరిన నీ నవ్వుల కొసలకు, అందాలు దిద్దుకొన్న నీ యావన సీమాంతాలకు, ఎందుకో అనుక్షణం నామనసు పరుగులు పెడుతూఉన్నా, నోరార

"రామన్నా ! ఏంచేస్తున్నావోయ్ ! ఎంతబాగా పూవులు పూయిస్తావోయ్ !" అని అనకుండా చేసిందేమిటి ? నాభాగ్యమేకదా ! నన్ను నా రామన్ననుంచి వేరు చేసిందేమిటి ? అశాశ్వతమైన ఈ శిరి సంపదలేకదా !" అనుకుంటూ రామన్నను వీడలేక వీడలేక వీడేది మన నిర్మల.



ప్రేమ నదీప్రవాహం గతుల నంతం; అగమ్యం. దానిలో ఎదురీతలుకొట్టి ఈదలేక, మధ్యలోనే అలిసి సొలిసి ఏటిలోనే ఆహుతి అయిపోయే అభాగ్యులు కొందరు. దాని వాలుగా జాయిగా పోయి తీరంచేరే భోగులు కొందరు. సుడిగుండాల్లో సున్నలుచుడుతూ నశించే దౌర్భాగ్యులు కొందరు. నదీప్రవాహాన్ని పరిశీలిస్తూ తీరాన్ని కూర్చొని ఆనందించే అల్పసంతోషులు కొందరు. ఇలా ఎన్నో రకాలు.

ప్రేమనెరుగకుండా తమ శరీరాల నమ్ముకొనే జూదగాండ్రు కొందరు. ప్రేమకు తమ జీవితాలను బలిచేసి ఆత్మీయ ఆనందాన్ని అనుభవించే త్యాగమూర్తులుకొందరు...ఎవరి మనఃప్రవృత్తులను బట్టి వారు వారి మార్గాలను చూచుకుంటారు.



కాలం గడుస్తున్నకొద్దీ నిర్మలపై అనురాగం చివురులు తొడిగింది రామన్నను రామన్నపై అభిమానం పూవులు పూచింది నిర్మలకు.

కాని-రామన్నతో మాటాడితే ఎవరేమనుకుంటారో అని నిర్మలకు, నిర్మలతో మాటాడితే ఎవరేమనుకుంటారో అని రామన్నకు - ఇలా ఒకరితో నొకరు మాటాడకుండా కాలం గడుపుతున్నారు.

వారి హృదయాల్లో వినబడే ప్రేమగీతాలు వింటూ, కన్నీటిలోనే తమ కవితామధువును పొంగించి పొర్లించు కుంటున్నారు.

ఇలా ఎంత కాలం?

మనసుంటే మార్గానికి లోటేమిటి? ఆరోజు పున్నమి. వెన్నెల కౌగలింతలలో కన్నెపూవుల వలపు కరిగి మరిగి పోతుంది.

తలారా స్నానంచేసి, తెల్లని సిల్కుకోక కట్టుకొని గులాబీరంగు జాకెట్టుతొడుక్కొని, వసంతలక్ష్మిలా తోటలోకి వచ్చింది నిర్మల.

ఆమె ఆనందానికి ఆరోజు అంతులేదు; పొంగి పొర్లే హృదయ రసధునీ ప్రవాహాలకు ఆనకట్టలులేవు.

పాడుతూంది కోకిలతో; ఆడుతూంది తుమ్మెద దిమ్మరీడుతో ...

పాదులకు నీళ్ళుపోస్తూ పాటవింటూన్నాడు రామన్న. నీటిబిందె చేతులోనేఉంది; నీరు పాదులపై జారడంలేదు. అలాగే కన్నులకప్పగించి ఆసౌందర్య రూపవల్లిని చూస్తూ నిల్లబడిపోయాడు.

గీతం :

నేనేమి సేతు నోయీ !

నా రా జ

నీ కేమి ఇత్తునోయీ !

దాచుకొందా మన్న

దాగ నన్నా వలపు

తెరచు కొన్నది ఎడద ;

పరచు కొన్నది పాన్పు— ॥నేనేమి॥

ఎడద లోపలి వీణ

నెవరు మీటిరొ కాని,

ప్రతి పాట వలపుతో

పండించు కొన్నాది...... ॥నేనేమి॥

రాగాల వేడిలో

రాళ్ళు కరిగే రేయి,

నీకంట నారూపు

నిండి కన్నీరోడ్చు...... ॥నేనేమి॥

తెలిసి తెలియని మనసు

కలలు కన్నా రేయి,

అందాలు నాలోన

అద్ది దిద్దిందోయి...... ॥నేనేమి॥



పాటవింటూ, పరవశంతో, కన్నీరు కారుస్తూ చెట్టు కానుకొన్న రామన్నను చూచింది...వెఱ్ఱివానిలా కార్చే కన్నీరు ఆమె హృదయాన్ని కదిలించి వేసింది. ఆమె అతని వంక జాలిగా చూడకుండా ఉండలేకపోయింది.

"రా...మ...న్నా!"

"ని...ర్మ...లా!"

"ఎందుకా కన్నీరు?"

"ఆనందం ఆపుకోలేని నా చిన్నగుండె ఇరుకైపోయి కన్నీటిద్వారా బయటపడిపోయింది."

"ఎందు కానందం?"

"హృదయం ఉందికనుకా!

"తోటకునీళ్ళుతోడేకాపు వానికి హృదయంకూడానా?

"హృదయండుండేదే కాపువానికి,లక్షాధికారులకు కాదు.

"అయితే మాకు హృదయం లేదంటావా?"

"ఉండదనే అంటారు"

"ఎవడా అనేది?"

"నాబోటివాడే"

"చాల్లే. ఊరుకో. చనువిచ్చి మాటాడినందుకా హృదయం లేదంటున్నావ్? అందుకే మానాన్న మీవంటి వాళ్ళతో మాటాడనీయడు......కూలి వాళ్ళకే ఇంత పొగరుంటే కోటీశ్వరుల కింకెంత పొగరుండాలి?

"కోటీశ్వరుల కసలు పొగరుండరాదు. కారణం వాళ్ళు కష్టించి గడించడంలేదు. మేం అలాకాదు. కష్టపడు తున్నాం. గడిస్తున్నాం. మాది యదార్థమైన ధర్మార్జన.

మీదలాకాదు. అందుచేత గర్వించవలసింది మేం కాని, మీరు కాదు.”

చాల్లే నోర్మూయ్!

“నా నోరుమూయించేది నీ ఆజ్ఞకాదు నిర్మలా — నీ అందం.”

“ఉహూఁ”

“కోపంవద్దు. ఒక్కమాట. మిమ్మల్ని మేం కోటీశ్వరులును చేస్తే, మీరు మమ్మల్ని కూలీలను చేశారు. ఈ విషయం మరచిపోకు. మీ ఖజానాలోని ప్రతి బంగారపు నాణెం మీదా మా నెత్తుటిముద్ర ఉన్నదని మరచిపోకు... పేదవాళ్ళం మేం కాదు; మీరు. మీకు భిక్ష మేం పెడుతున్నాం; మీరు మాకేమీ పెట్టడంలేదు. మ కష్టాన్నే మేం తింటున్నాం. తెలిసిందా నిర్మలా?”

“తెలిసింది పేదలకు చాలా గర్వం ఉంటుందనీ, సభ్యతా సభ్యతలు తెలియకుండా మాట్లాడతారని...ఇంతకూ నీవంటి క్షుద్రునితో మాట్లాడం నాదేతప్పు.”

ఆమాటలంటూంటే ఆమె పెదవులు వణికి పోయాయ్; ఆమె కన్నీళ్ళు చెదరిపోయాయ్.

గిఱ్ఱుమని వెనక్కు తిరిగింది. ఒక అంగ వేసింది. అంతలో ఆమె అన్న భద్రం వచ్చాడు. చూశాడు. ఆశ్చర్య

"చెల్లమ్మా! ఎందుకీ కన్నీళ్లు."

"ఏమీలేదు."

"చెప్పమ్మా! నిన్నా రామన్న ఏమన్నాఅన్నాడా!"

"ఒకమాటేమిటి- నానామాటలు."

"ఏమిటీ..."

అంతే. పక్కనే నిలబడ్డ రామన్న చెంపలు పగిలే టట్లు నాలుగు లెంపకాయలు కొట్టాడు.

రామన్న ఏమీ మాటాడలేదు.తలవంచుకొనినిలబడ్డాడు.

'పో! పనిచేసుకో! జాగ్రత' అని భద్రం అన్నామా టలు వింటూ వెళ్ళి నీళ్ళుతీసుకొస్తున్నాడు.

రామన్న శాంతాన్ని చూచిన నిర్మల మతిపోయింది. అనవసరంగా కొట్టించానే అనే ఆవేదన ఎక్కువైపోయింది.

తిన్నగా అన్నతో ఇంటికి వెళ్ళింది. పక్కపై వాలి పోయింది. 'రామన్నా! ఎంతపని చేశానోయ్! రామన్నా! నన్నింక క్షమించగలవా! నీముఖం ఇంక చూడగలనా? నా. ధనమదాంధత నన్నెంత మూర్ఖురాలను చేసింది...నీవేమన్నా వని...రామన్నా!

ఎన్ని దెబ్బలు కొడుతున్నా పన్నెత్తిమాటాడలేదే... నీఔదార్యము, నీస్వామిభక్తి, నీశాంతి, నీసహనం— ఎన్ని జన్మలకుమాకబ్బుతాయ్!

రామన్నా! నిర్దోషివినీవు; దోషినినేను...నన్ను ఏభగ వానుడూ మన్నించలేడు; క్షమార్హనుకాను'అనుకుంటూ తన వేడికన్నీటితో తలగడ తడుపుకొంటూ వెక్కి వెక్కి ఏడు స్తూవుంది.

తోటలో రామన్న తీగలకు నీళ్లుపోస్తూ ఉన్నాడు—

'నిర్మలా! నాశిరాన్ని నామొండెంనుంచి వేరుచేసినా, నానోరువలపూర 'నిర్మలా! నిర్మలా!' అని పిలుస్తుందేమో! అయ్యో! నిర్మలా! ఎంతపొరబడుతున్నాను. ఇంక పొరబడనులే' అనుకుంటూ ఇలా పాడుకుంటున్నాడు.

గీతం:

పొరపడకే మనసా!
నీలో
తెరపడునే మనసా!
పొదరింటిలో
నిదుర పోతే,
కాటు వైచునే
కాల సర్పమా— ॥పొరపడవే॥
మెరుపు కొర్కై
కరము చాచితే,
శిరముపై నొక
పిడుగు పడునే— ॥పొరపడకే॥
అమృత భాండము
నీలో నుంటే,
ఎంగిలి మెతుకుల
కాశించెదవేలా— ॥పొరపడకే॥

స్వేచ్ఛాగానము
సేయక నీకీ

బంగరు సంకెల
భ్రాంతి ఏలనే...... ॥పొరపడకే॥

♦ ♦ ♦ † ♦

ఎవరి మనఃప్రవృత్తుల ననుసరించి
వారి మాటలూ, వారిచేతలూ కదా!



## ౨

రాత్రి 12 గంటలవుతుంది.

భద్రం సినిమానుంచి ఇంటికివచ్చాడు. కారు దిగి లోపలకు వెళ్ళాడు. మేడెక్కాడు. తలుపులు తీశాడు. పాలు టేబుల్ మీద వెండిగ్లాసుతో పెడుతూఉన్న కోటమ్మను చూచి ఆశ్చర్యపోయాడు.

"కోటీ"

"వచ్చావా పెదబాబూ?"

"ఇంతవరకు మేలుకొనావే?"

"మేలుకోపోతే వేడిపాలెలా గుంటాయ్ నీకు?"

"వేడి పాలీపూటకు లేకపోతేనేం?"

"అమ్మో! చల్లని పాలెలా తాగ్గలవు?"

"తాగలేకపోతే మానేస్తాను. ఒక్కపూటకే కండలు కరిగిపోతాయా? అందాలు తరిగి పోతాయా?"

"మాటలు నేర్చావే."

"నేర్పినా నేర్చుకోలేకపోడానికి నేనేమైనా మందగొడ్డునా ? మట్టి బుఱ్ఱనా ?"

"ఏం గర్వమే."

"కాక పోతే."

కోటి నవ్వుతూ బయటకు వెళ్ళబోయింది. కోటిచెయ్యి పట్టుకొని "నన్నడక్కుండా వెళ్ళిపోతావే ?" అన్నాడు భద్రం.

"అడిగి వచ్చాను కాబట్టి, అడిగి వెడతానా ? అయినా అయ్యగారికి ఉన్నాకొద్దీఆడవారిపై చనువెక్కువై పోయిందే!" అంటూ చెయ్యివిడిపిచ్చుకొని మంచం పక్కన నిలబడింది.

"కోటీ ! నాన్న ఏంచేస్తున్నాడే ?"

"అమ్మగారిచ్చే తమలపాకులందుకొంటున్నారు."

"ఏమిటీ ! ఇంకా నిద్రపోలేదూ ?"

"లేదు."

"లేదూ ?"

"ఎందుకు పెదబాబూ ఆ ఖంగారు ? వారు మేలుకుంటే నేనిక్కడకు రాకూడదా ?

"రావచ్చు పగలైతే, అర్ధరాత్రివస్తే అనుమానించరూ ?"

"అనుమానించనియ్. ఏంచేస్తారు ? అనుమానించి ఇద్దరి అనురాగం పాడుచేయకుండా పెళ్ళిచేస్తారు. అంతేగా ?"

"ఛా ! ఊరుకో. దాసీ దానివి నీవు ; నీకూ నాకూ పెళ్ళేమిటి ?"

"పెళ్ళయితే దాసీదాన్నేమిటి? ఇంటికి ఇల్లాలు నవుతా. లోకానికి మహాలక్ష్మినవుతా అప్పుడందరి పూజ లూ నావేగా?"

"చాల్లే నీగదిలోకి వెళ్ళి పండుకో!"

"ఎంతకాలం నాగదీ—నీగదీ అనే భేదం?

"ఇద్దరిగడ్డీ ఒక్కటయ్యేవరకు."

"అదే ఎప్పుడంటున్నా?"

"ఎప్పుడు విధి నియామకం ఉంటే అప్పుడు."

"మళ్ళీ తోసేశావ్ విషయం విధిమీదికి!"

"అబ్బా! గోలచేయక వెళుదూ?"

"ఇప్పుడు వెళ్ళమంటున్నావ్; రేపు రమ్మన్నప్పుడు చెబుతా."

ఆమాటలంటూ నవ్వుతూ, వాలుజెడ అటూ ఇటూ ఆడుతూ ఉంటే, నవ్వులు వలగబోసుకుంటూ, వారచూపుల భద్రాన్ని చూచుకుంటూ, తనగదిలోకి వెళ్ళిపోయింది కోటమ్మ.

కోటమ్మ దేవ్వారో, తల్లిదండ్రులెవరో, ఎవరికీ తెలీదు. భద్రం తండ్రి రామబ్రహ్మం ఒక రోజు షికారుకు వెళుతుంటే, ఒక పొదలో ఏడుస్తూన్న ఒక రెండు నెలల అమ్మాయినిచూచి, జాలిచెంది ఇంటికి తీసుకొచ్చాడు. కోటపక్కన దొరికింది కాబట్టి కోటమ్మ అని పేరుపెట్టారు.

ఆ కోటమ్మే మన భద్రం ప్రణయిని; ఆత్మీయ జీవన బాంధవి; అనురాగ నిధానము. కోటమ్మ నిర్మలకంఠ

నాలుగేళ్ళు పెద్ద. నిర్మలకంటే సౌందర్యవతి. కాని వట్టి అల్లరిపిల్ల. అందరినీ గోల చెయ్యడమే అనువని.

భద్రం ఎం. ఏ. ప్యాసయ్యాడు. తండ్రి ప్లీడరు చదవమంటే చదవనన్నాడు. ఏ ఉద్యోగమైనా చెయ్యమంటే చేయనన్నాడు. వర్తకంమాట చెబుతే; విననన్నాడు.

ఎప్పుడూ కూలివాళ్ళ ఫొటోలు తీయడం; వాటిని ఎన్లార్జి చేయడం; తన గదిలో పెట్టుకొని వాటిపై పద్యాలు వ్రాయడం. ఇదీ అతని పని.

'అన్నయ్యా! ఎప్పుడూ కార్మిక కర్షకులకష్టాలే మాకు చెబుతూఉంటావ్ — ఒక్కనాడైనా నాన్నకు చెప్పవే!' అని నిర్మలఅడిగితే.

"నిర్మలా! నాన్న కళ్ళకు దురాశఅనే నల్లద్దాల కళ్ళజోడుంది. దానితో చూసినంతకాలం లోకంలోని యదార్థం ఎలా తెలుస్తుంది చెప్పు? పైగా బూజుపట్టిన ఆయన హృదయం కరగాలంటే కొన్ని జన్మలు పట్టాలి. ఆయనకు తెలిసిందల్లా ఒక్కటే—పేదల గుండెలుపట్టి నెత్తురుపిండి కాసులు తయారుచేయడం." అంటూ గుక్కతిప్పకుండా గంటలకొద్దీ మాట్లాడతాడు.

అతనిదంతా అదో విచిత్రజీవితం; వింతభావం—

రోజులు గడుస్తున్నకొద్దీ అతనికా యిల్లు నరకప్రాయం అయిపోయింది. అతనికి రెండే ఆశయాలు. ఒకటి స్వతంత్ర సముపార్జితం; రెండు పేదల నుద్ధరించడం. కాని చందుృనిలో

మచ్చలాగ అతనికొకే ఒక పెద్దలోపం ఉంది. ఏమిటంటే ముక్కోపితనం. అందుకనే రామన్నను వెనుకా ముందూ చూడకుండా అలా లెంపకాయలు కొట్టాడు.

కొట్టిన గంటకతని కోపం చల్లారింది. ఏ కూలీలకై తాను కష్టపడుతున్నాడో, ఆ కూలీలనే కొట్టినందుకు చాలా పశ్చాత్తాపపడి, వెంటనే వెళ్ళి రామన్నను క్షమించమని బ్రతిమాలాడు.

రామన్న భద్రం కరుణాసముద్రానికి పొంగిపోయి వేయివేల దేవుళ్ళకు నమస్కరించాడతనిగురించి ఆనాటినుంచి రామన్నంటే చెప్పలేనంత అభిమానం భద్రానికి. భద్రం అంటే పంచప్రాణాలు రామన్నకు.

కాలం గడుస్తూంటే భద్రంలో వింతమార్పులు పొడ చూపుతూ ఉన్నాయ్. మాట్లాడితే "కోటీ! నేనే దేశంగురించి ఖయిదుకు వెడితే నీవేంచేస్తావ్?" అని అడిగేవాడు. ఆమె 'నీవుఎప్పుడో వెళతానంటున్నావు. నేను ఇప్పుడే వెళ్ళబోతు న్నాను.' అనేది. అలా వారిద్దరిభావాలూ ఒకటిగానే ఉంటూఉన్నాయ్.



ఒకరోజు రాత్రి రాంబ్రహ్మం నిప్పులు కక్కుకుంటూ ఇంటికి వచ్చాడు. అప్పుడే పాలులో "సోవియట్ రష్యా" అనే పుస్తకాన్ని చదువుతున్నాడు. వెంటనే ఆపుస్తకం చేతుల్లోనుంచి లాక్కొని ఆవల పారేశాడు.

భద్రిం ఆశ్చర్యపోయి అతనివంక చూస్తూ నిలబడి పోయాడు.

“ భద్రిం! ఉన్నాకొద్దీ మితిమీరిపోతున్నావే !”

“ ఏం చేశాను ?

“ రాత్రి నిండు సభలో ‘జమీందారీ విధానం నశించాలి; కార్మిక కర్షకుల కష్టాలు పోవాలి’ అంటూ రెండు గంటలుపైగా ఉపన్యసించావంటే. ? ”

“ అవును. దాంట్లో తప్పేమిటి ? కార్మిక కర్షకుల కష్టాలు పోవాలనడం తప్పా ? ”

“ నీవు పోవాలంటే పోతాయా ? ”

“ ఎవరు పోవాలంటే తప్పుతాయి. ”

‘మహాత్ములు; దేశోద్ధారకులు. ’

“ వారు పోవాలంటున్నారుగా.

“ ఇంక నీకెందుకు ?

“ నాన్నా ! మహాత్ములనుంచి సామాన్యులవరకూ ప్రతి మానవుడూ ఎల్గెత్తి ఘోషించాలి; భూనభోంతరాళాలు ద్దద్దరిల్లాలి. సృష్టి కేవలం తారు మారు కావాలి. ”

“ అప్పుడు నీ లక్షాధికారితనం ఏమౌతుంది ? ”

“ భిక్షాధి కారితనం. ”

“ ఆనాటితో నీకు భిక్షపెట్టేవాడెవడుంటాడు ? ”

“ అంతా భిక్షకులమై, నేలదున్ని పంట పండించుకుంటూ, పండిన పంటానంతా కలిసి అనుభవించే దాని

కంటే ఆనందం ఏముంటుంది? నలుగురితో అనుభవించే నరకం స్వర్గంకంటే ఆనందం కదు నాన్నా !"

"భద్రం ! వెధవలతో తిరుగుతుంటే వచ్చేవన్నీ వెధవభావాలేగా...నీచసావాసం పవిత్రభావాల నెలా కలిగిస్తుంది" అంటూ నాలుగూ తిట్టి ఇంట్లోకి వెళ్ళిపోయాడు. భద్రం మళ్ళీ ఆపుస్తకమే తీసుకొని చదువుకుంటూ కూర్చు న్నాడు.

ఆరోజు భోజనానికైనా వెళ్ళలేదు. ఎవరూ రమ్మన లేదు. రాంబ్రహ్మం ఆజ్ఞప్రకారం నిర్మలా కోటమ్మలు గది కదలలేదు.

రాత్రి ఒంటిగంటయింది.

అంతా నిద్రపోతున్నారు. అతడుమాత్రం ఆపుస్తకం అలాగే చదువుతూ కూర్చున్నాడు. నెమ్మదిగా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ కోటమ్మ వచ్చింది.

"పెదబాబూ ?"

"ఎవరు ?"

"నేనే...ఇంకెంతసేపు చదువుతావ్ ?"

"అయిపోవచ్చింది."

"త్వరగా గదిలోకిరా, పయినుంటా."

"సరే!"

కొంతసేపటికి పుస్తకం పూర్తికాగానే మేడమీదకు వెళ్ళాడు. అక్కడో మూల కుర్చీలో కూర్చుని, ఎన్నడూ

ఏడ్వని కోటమ్మ వెక్కి వెక్కి ఏడుస్తూంది. నెమ్మదిగా వెళ్ళి, తనదగ్గరకు తీసుకొని, కన్నీళ్ళు తన చేతులతో తుడుస్తూ "కోటీ ? ఎందుకే ఏడ్పు ? నాన్న నాలుగు మాటలన్నంత మాత్రంలోనే ఏడుస్తే, ఇంక లోకం పొడిచే కాకిపోటులెలా భరించగలవు? పిచ్చిపిల్లా ! రా ! భోంచేశావా ? " అన్నాడు. లేదు అన్నట్లుతలూపింది ఆమె.

"కోటీ! ఎందుకు భోంచెయ్యలేదు ? "

"నీవు తినందే నాకెలా సహిస్తుంది ? "

"అయితే నాతో ఇవాళ నీవూవస్తుండవలసిందే ? "

"ఎందుకు ?"

"మరెలా ? "

"అదిగో ! ఆ టేబుల్ మీద...మరో రెండు వేపుళ్ళతో సహా. "

"అమ్మదొంగా ! ఇద్దరికి సరిపోతుందా ? "

"చాలేటట్టు తేకపోతే నాకేం కర్మం వస్తుంటానికి ?"

"బలేదానవులే. సరే. ఆతలుపు వేయ్. ఇద్దరం కలసి భోంచేద్దాం. "

"ఒక్క కంచంలోనేనా ? "

"అలాగేలే రద్దూ. "

ఆమె తలుపులు వేసి వచ్చింది. ఇద్దరూ కలిసి ఆనందంతో భోంచేశారు.

"పెదబాబూ ! మీనాన్న చూస్తే ? "

" చూడనీయ్. ఏం తప్పుచేస్తున్నామని ?"

" ఏం తప్పు చేస్తున్నామని తలుపులు వేయమన్నావ్ ?

"తప్పుచేస్తున్నాం అనికాదు; పెద్దలను గౌరవించే విధానం అది అని"

"ఉహూ! అవునుగాని పెదబాబూ! మీనాన్న అలా నిందిస్తూంటే, అంత శాంతంగా ఎలా చెప్పగలిగావోయ్."

"మహాత్ముల కావ్యాలు చదువుతుంటే మనసుకు శక్తి వస్తుంది. అప్పుడు మనసు మనస్వాధీనంలో ఉంటుంది. అలాకాకపోతే మనం మనసు స్వాధీనంలో ఉండాలి.'

"చిత్రం."

ఇద్దరూ ఆనందంగా కొంతకాలం గడిపారు. కోటమ్మ తనగదిలోకివెళ్ళి నందుకుంది శాంతిగా. ప్రపంచపరిణామం ఆలోచిస్తూ ఆకాశంవంక చూస్తూన్నాడు భద్రం. అలా ఎంతసేపో ! !



## 3

గీ తం:

ఇంతలోనే మనసు మారాలా?

తుమ్మెదా!

ఇంతలోనే ముఖము వాల్చాలా?

హృదయ దళములు
విప్పు కొంటిని;
వలపు తేనెల
త్రావ మంటిని; ||ఇంత||
ప్రేమ కొరకై
చేయి చాచితి;
ప్రేమ పాత్రను
పెదవి కిచ్చితి; ||ఇంత||
వలపు కిన్నెర
మీట మంటిని;
వలపు గీతిక
పాడ మంటిని; ||ఇంత||

◆ ◆ ◆ ◆

ఆపాట పాడుకుంటూ నిర్మల తోటలోకివచ్చింది. రావన్న "టమాటాపళ్ళు" కోస్తూన్నాడు. అతని పక్కనే నిర్మల నిలబడింది. అతడు చూడనట్లు నటించి, పళ్లుకోసు కుంటూ ఉన్నాడు.

నిర్మల పావుగంటనిలబడింది. రావన్న మాటాడలేదు.

'ఇంకా ఎంతసేపీ బింకం!'

'... ... ...'

'ఓ కే.'

'నీకే.'

"ఎంతసేపా?"

'ఆఁ ఎంతసేపు?'

'నీవూ నేనూ కలిసి ఈటమాటోపళ్లు కొన్ని తినేవరకు

'అంతేనా?'

"అంతే.'

'ఆతరువాత ఆపంటకాలవలో కాళ్ళు ఆడిస్తూ ఇద్దరం కాసేపు కూర్చునేవరకూకోడానా?'

'నీకభ్యంతరం లేకపోతేసరి.'

'నాకభ్యంతరం ఎందుకు?'

'మళ్ళీ నిందించవుకదా?'

'చాలెద్దూ దెప్పావ్?'

ఆమె వాలుగన్నుల వలపు చిలికించింది. అతడు వెన్న లా కరిగిపోయాడు.

ఇద్దరూ కొన్ని దోసపళ్ళు, కొన్ని టమాటోపళ్ళు తిన్నారు. చెరోరెండు కొబ్బరిబొండాలు తాగారు.

'రావన్నా! ఎంత శాంతమూర్తివోయ్!'

"పేదలకున్నా ఆస్తి అదేగా!'

'అదేమిా ఆస్తిఅయితే గొప్పవాళ్ళకంటే నిజంగా గొప్పవాళ్లేసుమా!"

'కాదని ఎవరనగలరు?"

'మా నాన్న.'

'ఆయనను మానవుల్లో లెక్క వేస్తేగా?'

'మరెవరు?'

'తోటిసోదరుల గుండెలపైనుంచి నడిచివెళ్లే రాక్షసుడు'

"అదిగో—మళ్ళీదూషిస్తున్నావ్?'

'దూషించడంలేదు; యదార్థం చెబుతున్నాను'

'మళ్ళీ అనవసరంగా...'

'కోపం తెప్పిస్తున్నానా నిర్మలా?'

'తెప్పించడం లేదూ?'

"అయితే మళ్లీ లెంపలు పగిలాయన్నమాటే.'

'చాల్లే ఊరుకో!»

అతడామెవంక తీయగా, హాయిగా, జాయిగా చూచాడు. అంతే ఆమె జీవితం రసప్రవాహంలా పొంగి పొర్లిపోయింది.

'నిర్మలా!'

'ఏం?'

"నాతో మాటాడుతూంటే నీకు చిన్నతం కలగడము లేదూ?"

'ఎందుకు?'

"మావంటి పేదవాళ్ళతో నీవంటి కోటీశ్వరునికూతురు మాట్లాడవచ్చునా?'

"మాట్లాడకపోతే, పోట్లాడాలా?'

'అదే. అదే!'

"అంతకంటే అకృత్యం ఏముంది రాఘవన్నా! అందరూ ఒకటి కాదూ? నిజానికి పేదలలో ఉన్న ప్రేమ ఎవరిలో ఉంటుంది'

" ఎవరిలోనూ ఉండదు."

రాఘవన్నా ! నీ హృదయానికున్న ఆరోగ్యం, నీ శరీరానికున్న సౌష్ఠవం, నీ ఆత్మకున్న సౌందర్యం-ఏ కోటీశ్వరునికుంటుంది? లేత సూర్యుని బంగారు కిరణాలు కుంచెల్లా పంట కాలువ పిల్లకెరటాలపై రంగులు చిత్రిస్తూ ఉంటే, ఆతోటి తోపు వెనకనుంచీ మామిడిపండులా సూర్యుడు హాస్యమిస్తూ ఉంటే,— సాయంకాలపు బంగారు రంగులన్నీ రెక్కలమీద మెరుస్తూ ఉంటే రెక్కా-రెక్కా జతచేర్చి చక్కగా తమతమ గూళ్ళకు వెళ్ళే పక్షులను చూస్తూ ఉంటే ఎంత ఆనందంగా ఉంటుంది !

'చెప్పలేనంత. నిర్మలా! ప్రకృతి ముద్దుకుమార్తెనై ఇలా బ్రతికే దానికంటే కావలసిందేముంది? ఇనుపపెట్టిలో రూపాయిలమధ్యపడి నాభావాలు చిదికిపోయే దానికంటే— ఈపూల మధ్య ఒకచిన్నిపూవునై, ఏశుభముహూర్తానో రేకులు రాల్చుకొని నేలలో కలిసి పోవడంకంటే ఆనందం ఏముంటుంది?'

'బాగా చెప్పావ్! ఎలాగైనా బలేవాడవోయ్ రాఘవన్నా! నీకంటే మంచివాడ్నీ, నీకంటే మెత్తని మనస్సు కలవాడ్ని చూడలేదోయ్!"

'ఇదంతా నీ అనురాగం తప్ప మరేమీలేదు నిర్మలా?'

'నా అనురాగమా?'

'కాకపోతే నీప్రేమ.'

'ప్రేమా!'

"దాచగలవా నిర్మలా. నీ నిర్మలప్రేమ మాధుర్యాన్ని? నీ కళ్ళు చెప్పడంలేదూ నీ హృదయం లోని మాటలన్నీ? నీ చూపులు జిమ్మే అనంత ప్రేమామృతాన్ని దాచడానికి నీ తరమా? నిన్ను సృష్టించిన విధాత తరమా?"

"చాల్లే. ఎవరైనా ఈ మాటలు వింటే ఏమనుకుంటారు?"

"ఏమనుకుంటారు? నీవు నన్ను ప్రేమించావనుకుంటారు?

'నిజం.'

'తప్పకుండా.'

'అయితే వెళ్ళిపోతాను బాబూ! ఈసంగతి తెలుస్తే మానాన్న నన్ను బ్రతుకనిస్తాడా? ప్రాణాలు తీసివేయడూ?'

'ప్రాణాలు తీసివేస్తే ప్రేమ చస్తుందా?

'చావక?'

"నిర్మలా? చచ్చేది శరీరంకాని; ఆత్మకాదు. ఆత్మకు చావు పుట్టుకలు లేవు. ఆ ఆత్మ వికాసమే ప్రేమ. ఆత్మ ఎట్లా నశించదో, ప్రేమకూడా అలాగే నశించదు."

'అయితే నీయందు నాకున్నా...'

'ప్రేమ పోదు నిర్మలా!'

"అయితే ఎలా?"

"అనుభవించి తీరవలసిందే."

"ఇంకా నయ్యంలే. పెద్ద పెద్ద మాట్లంటున్నావ్. ఎవరన్నా వినగలరు? గోడలకు చెవులుంటాయ్."

"చెవులేకాదు; కళ్ళుకూడా ఉంటాయ్...."

"ఊహూఁ"

ఆమె నవ్వుతూ, కోపం ఉన్నట్లు నటించబోయి నటించలేక, దాచుకోలేని తన వలపును దోచుకుంటూన్న రావన్న వంక చూస్తూ, వెళుతూంది.

"ని—ర్మ—లా!"

"ఏం?"

నీ శరీరాన్నైతే నీతో మోసుకు పోతున్నావు కాని, నీ హృదయాన్ని మోసుకు పోలేక పోయావుసుమా?

ఏం!

అది నాదగ్గరే ఉంది. నీ కన్నీటి ముత్యాలు, నా హృదయ పద్మానికి మంచుబిందువు లవుతున్నాయని మరచిపోకు.

చిత్తం.

నిర్మలా! బాహ్య ప్రపంచంలో మనలను వేరు చేయగలిగిన ఈ సంఘం, అంతర్ప్రపంచంలో వేరు చేయలేదు

సుమా! మన ప్రేమ తెలుసుకొని మీ నాన్నగారు నా కళ్ళు తీయించవచ్చు; లొట్టలయ్యేటట్లు పొడిపించవచ్చు; కాని నా మనోనేత్రాన్ని పొడిపించలేడు సుమా! నీ వేలోకాల చివరనున్నా ఆ నేత్రం చూడగలదు.

నిర్మలా! సిగ్గుతో ఎవరైనా వింటారేమో అన్నా భయంతో-దాచుకొన్న నీ హృదయం అంతా, రాత్రి నీ కలల్లో, నీ హృదయ వీణ మీటుతూ పాటపాడే నాతో తన భావాలన్నీ చెప్పకుండా ఉండలేదు సుమా!

అంతేకాదు—

నిర్మలా! కోటీశ్వరుడైన మీనాన్న కూలివాడనైన నన్ను-నిన్ను ప్రేమించానే అనే కోపంతో-నలుగురితో చంపించవచ్చు. నా శవాన్ని ఈ తోటలో, ఆ మల్లెపొదమాటులో పూడ్పించవచ్చు. నా కొక సమాధికూడా నిర్మింపక పోవచ్చు. ఈ ప్రేమ జీవిత గ్రంథంలోని ప్రతి అక్షరం మట్టిలో పూడిపోవచ్చు. నీ కౌగిట వేడెక్కి, పొంగి, పొర్లి పోవాలనుకున్న నా హృదయం ఆనాడైనా మూగపోవచ్చు. పండిన నా వలపుపంట మంటలపాలై మాడిపోవచ్చు.

కాని—

నిర్మలా! పూవు రాలిపోయినా పరిమళం జారిపోనట్లు, నేను రాలిపోయినా నాప్రేమ వాసన లేమట్టిలోనూ కలిసిపోలేవు సుమ్మా! ఏ క్షణం నీ అడుగుజాడల సవ్వడి

వినిపిస్తుందో, ఆక్షణమే నీ పాదలను మెలపై చుకొని, కిలకిల నవ్వుతూ ఎన్నో వలపు గాథల చెబుతుందని మరచిపోకు.

'నిర్మలా—నీ—"

అతడింకేమీ మాటలాడలేక పోయాడు. కన్నులనిండిన కన్నీరు పెదిమలపై పడి, చిటిలి చిందిపోయింది. గొంతుకు బొంగురు పోయింది. తలత్రిప్పి వెళ్ళిపోతున్నాడు.

"రా—వ—న్నా!"

"ని—ర్మ—"

అతడొక్క గుటకమ్రింగి ఆమె ముఖమైనా చూడకుండా వెళ్లిపోయాడు కోడితాచుపిల్లలా—

నిర్మల అతని నిశ్చలప్రేమకు ఆశ్చర్యపడి చెమ్మగిల్లిన కన్నులు పయిటచెంగుతో తుడుచుకుంటూ 'శభాష్ రావన్నా! నీకంటె ప్రేమమూర్తిలేదు, నీవు ధర్మవీరుడవు; కర్మవీరుడవు. మాఅన్నయ్య చెప్పినట్లు సిన్నీ స్వార్థసంఘం కూలివానిని చేసింది. మహాత్మునివంటి నీచే పనిచేయించుకుంటూంది. నీ చెమటలో తడిసి, నీనెత్తుటి పొంగులో వేడెక్కి, పండిన పంట అది అనుభవిస్తూంది. నిన్ను ఆకలిమంటలకు గురిచేస్తూంది—రావన్నా! నీవు సామాన్యుడవు కావోయ్! సంఘాన్ని నడపగల సారథివి; రథంక్రింద పడిపోయావ్; చక్రాలకంటిన నీ నెత్తురు, ముద్దకట్టిన పూర్వఅభాగ్యజీవుల నెత్తుటిలో మునిగి పోయిందోయ్!

రావన్నా! లోకంలోని కుళ్లు కడగగల నీకన్నీళ్లు నాలో అమృతగీతాలాలాపన చేస్తున్నాయ్! నన్ను నీనుండి వేరుచేయవచ్చు; దూరదూర తీరాలకు విసరివేయవచ్చు; కాని నాలో చిత్రించుకొన్న నీరూపాన్ని ఏస్వార్థహస్తం చెరిపి వేయగలదు? నాలో పూజింపబడే నీకు వేయబోయే కన్నీటి పుష్పమాలను తీయవద్దని ఏతండ్రి శాసించగలడు?

రావన్నా! మన దేజన్మబాంధవ్యమో, నిన్ను తలుచు కొన్నంత మాత్రాన, పున్నమినాటి సముద్రంలా, నాహృదయం పొంగిపోతూంది. నేను నీదాననే; రావన్నా! నేను నీదాననే— నీదాననే.” అనుకుంటూ ఇల్లుచేరింది.

---

## ౪

భద్రం కోటీశ్వరుని కుమారుడైనా కూలివాళ్ళంటే చెప్పలేనంత అభిమానం. గొప్పవాళ్లు పేదవాళ్ళను పెట్టేకష్టాలు తలుచుకుంటూ ఉంటే అతనిహృదయం మండిపోతూ ఉంటుంది.

రాం బ్రహ్మంగారికి రెండుమిల్లులున్నాయ్. ‘భద్రం! పెద్దమిల్లుకు వెళ్ళిరా!’ అని తండ్రి అంటే అక్కడకువెళ్ళి, కూలీలందరినీ చేరతీసి ‘ఇంకా ఎంతకాలం ఈసేవ? ఎంతకాలం

మీ బిడ్డల్ని తిండీ తిప్పలూ లేకుండా చంపుకుంటారు? కళ కళ లాడవలసిన మీ ఇల్లాండ్ర ముఖాల నెంతకాలం ఎండగడ తారు?—మీలో చచ్చిపోతున్న ఆశకు ఎప్పుడు ప్రాణప్రతిష్ఠ చేస్తారు? మూగవోయిన మీ జీవితాలింకెపుడు రాగాలాపన చేసేది' అంటూ గంటలకొలది ఉపన్యసించేవాడు.

అతనిమాటలు వింటున్నంతసేపూ వాళ్ళంతా ఉద్రేక పూరితులయ్యేవారు. కాని అతడు వెళ్ళిపోగానే, మేకలమంద లాగ, చెబితే యజమాని ఏదిచెబితే అదల్లాచేసేవారు.

భద్రం వెళ్లగానే కొందరు "ఇదంతా వట్టి దొంగ వేషం. ఇలాగంటే మనయందు దయ ఉంటుందనుకుంటామనుకున్నాడు. మేకతోలు కప్పుకున్నంత మాత్రాన్న పులి మేక వుతుందా? బొగ్గుగనుల్లో రత్నాలుదొరుకుతాయా? ఆతండ్రికి పుట్టిన కొడుకాదూ?" అనుకొనేవారు.

మరికొందరు 'రాంబ్రహ్మం పెద్దరికంపోయి భద్రం పెద్దరికం వచ్చినా బాగుండేది. మూడుపూటలా నాటినుంచైనా కూడుదొరకేది. వెన్నవంటి మనసుగలవాడు ఆ రాతి గుండెవానికెలా పుట్టాడో! ఇంతకూ ఎవరి పూర్వజన్మ సుకృతము వారిది" అనుకొనేవారు.

ఎవరి ఇష్టంవచ్చినట్లు వారనుకొంటూమేగాని, అంతా ఒక్క ఉద్దేశంలోనికి ఎన్నడూ రాలేదు; రాబోరు.



భద్రం ఇలా కూలీలలో సామ్యవాద సిద్ధాంతాలు రేకెత్తిస్తున్నాడని తెలుసుకొన్న రాంబ్రహ్మం కొడుకును ఛడామడా తిట్టి 'నాకు చెడపుట్టావురా!' అని అరిచేవాడు.

తండ్రి ఎన్ని మాటలన్నా సహించేవాడే కాని తిరగబడి ఒక్క మాటనేవాడు కాడు, భద్రం శాంతించినకొద్దీ రాంబ్రహ్మం కారాలు మిరియాలు నూరేవాడు.



ఏదెలాగున్నా కాలప్రవాహం అనంతగతుల్లో ప్రయాణం చేయవలసిందేకదా! కాలం గడుస్తున్నకొద్దీ కష్టజీవులు కార్చే కన్నీరు చూడలేకపోతున్నాడు మన భద్రం.

ఒక రోజున సాయంకాలం రాంబ్రహ్మంగారి వద్దకు, రాంబ్రహ్మంగారి కూలీ ఒకడు గొల్లుమని ఏడుస్తూవచ్చాడు. అతని ఏడుపు విన్న భద్రం మేడ మీదనుంచి కిందకు దిగి వచ్చాడు.

రాంబ్రహ్మం ఆకూలివాడ్ని చూచి ఇలా గర్జించాడు.

ఏం వెంకా! ఇలావచ్చావ్?

బా—బయ్యా!

చెప్పవోయ్ వెధవ ఏడుపూ నీవూనూ చెప్పి ఏడవకూడదూ?

పొద్దుటండీ—

వెధవసోది-అసలు విషయం చెప్పవే.

'నాభార్య—'

'చచ్చిందా?''

'చిత్తం''

'పోనీ! శని విరగడయింది. నీకూలిడబ్బులు నీపొట్టకే చాలడంలేదు. నీకోభార్యాకూడానా? భార్యాబిడ్డలు గొప్ప వాళ్ళకేగాని పేదవాళ్ళకు కాదు.'

"చిత్తం. చిత్తం.'

"అసలే దరిద్రదేశం; మీరు పరమదరిద్రులు; మీకు మరో కొందరు దరిద్రులా?''

"అలాగేనండి.''

"ఇంతకూ నీకేం కావాలంటావ్?''

"శవదహనానికి ఏమైనా ఇప్పించాలండి.'

"బాగు. బాగు. చచ్చినవాళ్ళందర్నీ తగలబెట్టడాని కేనా నాడబ్బుంది?'

"అలాగంటే నేనేం చెప్పనండీ... చిన్నప్పటినుండి మీదగ్గర పనిచేస్తున్నా, ఇంక మిమ్మల్నడక్క ఎవరినడు గుతానండి? ఎవరినడిగితే ఎవరిస్తారు'

'ఎవ్వరూ ఈయకపోతే నాలుగిళ్లు తిరిగి ముష్టెత్తు''

"ముష్టెత్తడమే అలవాటయితే పొద్దుటనుంచీ సాయం కాలం వరకూ ఎందుకుకష్టపడి పనిచేస్తానండి.''

'సరిలే. చేశావేమో; డబ్బుతింటున్నావేమో! ఊరికినే ఉంటే పొట్ట ఎలాగడుస్తుంది.''

'బాబూ! భార్యచచ్చిపోయిన విచారంకంటే, చచ్చిన భార్యను ఎలా తగలపెట్టనా అనే విచారం ఎక్కువైపోయింది.

'అది సహజమే. కష్టాలు కలిగినప్పుడే గుండె రాయి జేసుకోవాలి.''

'గుండె రాయిజేసుకుంటం మాకు తెలియని పని— బాబూ! ఏమైనా డబ్బిస్తే, కొద్దినెలల్లో తీర్చుకుంటాను. మీ మేలు మరచి పోలేను.'

వెంకన్న కళ్ళమ్మట నీళ్లు కారిపోతూన్నాయ్. తండ్రి మాటలన్నీ గుండెలో గునపపుపోటుల్లా నాటినాభద్రం అలాగే వారిమాటలు వింటూ రాతిప్రతిమలాగై పోయాడు.

రాంబ్రహ్మం తన గుమాస్తా రామశాస్త్రిని పిలిచాడు.

''శాస్త్రీ! వాడి భార్యా పోయిందట. పాపం! గోల పెడుతున్నాడు. కొద్దినెలల్లో వడ్డీతోసహా తీర్చుకుంటాడు. వాడికి పదిరూపాయలప్పు ఇచ్చి, నోటువ్రాయించుకో.''

'బాబూ! ముప్ఫైరూపాయి లిప్పించండి. కఱ్ఱలకే పదిహేనురూపాయిలౌతాయ్!

'వీల్లేదు. మిగిలిన డబ్బు ఎలాగో సంపాదించు. ఇద్దైనా మంచివాడవని నీకిస్తున్నా.''

ఆమాటలంటూ ఉంటే పదిరూపాయిలనోటు శాస్త్రి వెంకన్నకిచ్చి సంతకం చేయమన్నాడు నోటుమీద వెంకన్న చేయబోతున్నాడు.

అంతవరకూ శాంతించిన భద్రం ఇంక శాంతించ లేక పోయాడు. శాస్త్రి చేతిలో పుస్తకం కలయబడి లాక్కొని నేలకేసి విసిరికొట్టి పది రూపాయిలు నోటు తీసుకున్నాడు.

శాస్త్రి రాంబ్రహ్మం అంతా ఆశ్చర్య పోయారు. అలా వెర్రిగా చూస్తున్నారు. భద్రం కన్నులనుంచి చింత నిప్పులు చెరుగుతున్నట్లుంది. తండ్రి వంక తీక్షణంగా చూచాడు.

“నాన్నా! భార్యా చచ్చిపోయినందుకు శని విరగడై పోయిందని వెంకన్న సంతోషించాలా? లక్షాధికారులు భార్యాలు చచ్చిపోతే దేశం అంతా విచారించాలా? దరిద్రులు పిల్లల్ని కనకూడదా? లక్షాధికారులు పిల్లల్ని కనాలా? ఏం ధర్మం? ఎంత చక్కని ప్రబోధం.

నాన్నా! వెంకన్న ఎలాపుట్టాడో, నీవూ అలాగే పుట్టావు. ఇద్దరూ దిశమొలతోనే పుట్టారుగాని, కనకాంబరాలతోటి, కనక హస్తాలతోటీ పుట్టలేదు. నీకలిమీ, అతడి లేమీ, మధ్య కల్పింప బడ్డాయే కాని మీ పుట్టుకల్లో నిర్మింపబడ లేదుకదా!

నాన్నా ! ఈ అమాయకులైన ఈ కూలివాళ్ళను పేద వాళ్ళను చేసింది మీరు కదూ ! మీ పూర్వార్జిత ద్రివ్యం వల్ల లక్షాధికారి కోటీశ్వరుడౌతున్నాడు; కోటీశ్వరుడు జమీం దారౌతున్నాడు; జమీందార్ చిన్నరాజౌతున్నాడు; ఆచిన్న రాజు పెద్దరాజు అవుతున్నాడు; ఆతడు కాలచక్రం పై భా గంలో నిలబడేసరికి మహా చక్రివర్తి అవుతున్నాడు...... అలాగే ఈనాడు పదెకరాల గల రైతు, కుటుంబం పెరిగిన కొద్దీ అప్పులవల్ల పేదవాడై తుదకు ఎవరికో కవులుచేసుకొని పేదరైతు అవుతున్నాడు. కూలివాడు పిల్లా జల్లా కలిగే సరికి పోషించలేక క్రమీప శల్యగతుడై మృత్యుదేవతకు తనపిల్లల్ని గురిచేస్తున్నాడు.

ఇలా పేదవాని మరింత పేదవారిని చేస్తుంది మీరే కదా ! పైగా తిండీ తిప్పలూలేక, చలిలో బిగిసుకుపోయి, వానలో తడిసిపోయి, చస్తే-శనివిరగడయిందంటారా?

ఇదేనా మానవత్వం !

మానవులకు దయా, దాక్షిణ్యం-దానం, ధర్మం-జాలి, కరుణ-నీతి, నియమం-సత్యం, అహింసా-శాంతి, సహ నం-అభిమానం, అనురాగం-ప్రేమ, అభ్యుదయం ఉండాలి. ఉంటేనే మానవులౌతారు. లేకపోతే పశువులే, ఏ మాన వుడు ఎవటి మానవుని కన్నీటిలో తాను కరిగిపోడో-వ

మానవుడు ఎదటి మానవుని నెత్తుటి బురదలో తాను కరుడు కట్టుకుపోడో-ఏ మానవుడు ఎదట మానవుని సుఖ దుఃఖాలను తనవిగా భావించడో-ఏ మానవుడు జాతికుల మత భేదాలు కల్పిస్తాడో-ఏ మానవుడు సర్వమానవ సమత్వాన్ని పాటించడో-ఆ మానవుడు మానవుడు కాడు. సంఘసౌభాగ్యానికి సాలిగూడు; సంఘాభ్యుదయానికి చీడపురుగు; సంఘ స్వతంత్రానికి చెదపురుగు; మానవ లోకానికి మారణ హోమం;......అంతేకాదు-దుర్బలులను చీల్చుకు తినే పెద్ద పులి; పేదలను కాల్చుకు తినే పిశాచం; ఆనందాన్ని కబళించే కాలసర్పం...

ఇట్టి మానవుడు పశువుకంటె నీచం. ఎందుకంటే-పశువుల్లో ఒక పశువుకు ఆపదొస్తే మిగిలిన పశువులన్నీ గుమికూడి కాపాడతాయ్. వాటికున్న సంఘబలిమి మన కెక్కడిది? ఒక పశువుకు మరొక పశువు తోడ్పడుతుందే గాని, మీలా కబళించి వేయదే. మీరు మీ సోదరుల నెత్తురు పీల్చి పిప్పిచేసినట్లు, ఏ పశువూ తన తోటి పశువు నెత్తురు త్రాగలేదే.

వాన జల్లుచేత, మంచు బిందువులచేత కడగబడి, పెంచబడి, పచ్చల్లా మెరిసే పసిరికను పశువులన్నీ కలిసి కడుపునిండా తింటాయ్‌కాని-ఈ పెద్ద దుబ్బనాది, ఆ చిన్న దుబ్బ నీది-అని భాగాలు పంచుకోవే. మీలా స్వార్థంచే

కొంతనిలవవేసుకోవే. ఒకళ్ళనునాశనంచేసిమరొకటి భాగ్యదశ పొందలేవే. అడవిలో మేసే పశుల్లో ఆకలిదప్పులచే ఏపశువూ చావదే; చావబడదే—అన్నీ కలిసి ఆనందంగా ఒక్కచోట మేసి, అనురాగంతో ఒకచోట నీరుతాగి, కలతలెరుగని మనసులతో కన్నులు మూస్తాయే.

నాన్నా! వాటికంటే ప్రజలను పీడించి, బాధించి కోటీశ్వరులైన మీరెలా ఎక్కువ? ఆలోచించండి. పశువుల కంటే మీబ్రతుకెంత హేయమో? ఎంతపాపభూయిష్టమో! ఎంతపైశాచికమో యోజించండి—

పశువులకంటే ఉదాత్త బుద్ధిగలవారే మానవులు—వాటికంటే అత్యుత్తమ జీవితము గడపవలసిన వారే—దానికి తలక్రిందులుగా జీవితం గడుపుతూ ఎంత పతితులౌతున్నారో, మనో నేత్రం విప్పి చూడండి.

మనం గొప్పవాళ్ళం అయ్యేది డబ్బు గడించికాదు; మంచి గడించి. మనం పూజించవలసింది లక్ష్మినికాదు; సరస్వతిని...మనం సేవించ వలసింది ప్రభులను కాదు; ప్రజలను...మనం పొందవలసింది అధికారం కాదు; త్యాగం... మనం కావలసింది రాక్షసులం కాదు; మానవులం.—

ఈ పది రూపాయిల వల్ల గడిచి గట్టెక్కేందేమీ లేదు. మీరు చెప్పినట్లు ముష్టెత్తుకుంటే మంచిది. పాపం! కష్టజీవులకు కష్టపడడమే తెలుసును కాని ముష్టెత్తేడం తెలీదు. ఈ కోటీశ్వరుని కుమారునకు ముష్టెత్తడమే కాని కష్టించడం తెలీదు. ఎందుకంటే నేటివరకూ మీరు పెట్టిన ముష్టివల్లే కదూ జీవితం గడిపాను. అందుచే వెంకన్న కు బదులు నేనే ముష్టెత్తుతాను."

భద్రం ఆ మాటలంటూ ఉగ్రమూర్తియై పదిరూపాయిలనోటు తండ్రి ముఖాన్న పారేసి, వెంకన్న చేయిపట్టుకు బయలు దేరాడు.

అంతవరకూ నిస్పృహతో వింటూన్న రాంబ్రహ్మం తెలివిలోకొచ్చి "భద్రం! ఇలారా! ఒక్క నిమిషం ఆగు" అన్నాడు.

భద్రం ఆగి:

"నాన్నా! చనిపోయింది వెంకన్న భార్య కాదు; నా తల్లే. తల్లికి తలగోరు తనయుడే పెట్టాలి. అందుచేతే నేను వెళుతున్నాను."

"భద్రం! వాళ్ళ కర్మకు నీ వెందుకూ ఏడ్వడం,"

"వాళ్ళు నా సోదరులు కాబట్టి; వాళ్ళూ నేనూ ఒక్క మాతృ గర్భంనుంచి పుట్టాం కాబట్టి."

"అదేలా!"

"మమ్మల్నందర్నీ కన్న మాత ఒకతే; ఆమే మా భరతమాత ; మీరు మమ్మల్ని, మా తల్లి సౌభాగ్యాన్ని దోచే దారి దొంగలు; మమ్మల బాధించే కసాయివాళ్ళు."

"భద్రం ! ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా!"

"తెలుసు. ఒక కోటీశ్వరునితో."

"అతడు నీకేమౌతాడో తెలుసా."

"తెలుసు కాని చెప్పుకుంటానికి చాలా సిగ్గుగా ఉంది."

"అలాగా !"

"ప్రజాసేవ చేయలేని పందలందరూ భారత మాత కడుపున చెడ పుట్టారు. అయినా ఆయమ్మ వారి పాదాలను తన తలపై మోస్తూంది. వారు చచ్చాక, విడువక కడుపులో పెట్టుకొని దాచుకుంటూంది. ఆమె కరుణామయి; మీరో కఠినచిత్తులు; కరకు కసాయివాని కత్తి కిందపడి తుత్తునియలయ్యే పాపపు మాంస ఖండములు—

మీరు—ఛీ—

అతడు రుద్రమూర్తియై వెంకన్న భుజంమీద చేయ వేసుకొని బాణంలా వెళ్ళిపోయాడు.

"వినాసకాలే విపరీతబుద్ధి అని పోయేరోజు వచ్చింది కాబట్టే కూలిముండాకొడుకులతో కలిసి తానో కూలివాడి కింద పోతున్నాడు" అంటూ రాంబ్రహ్మం లోపలికి నిట్టూర్పువుచ్చుతూ వెళ్ళిపోయాడు.

ఏంపితృహృదయమో చూడండి.

♦ ♦ ♦ ♦ †

భద్రం వెంకన్ననూ, మరో ఇరవైమంది కూలీలనూ తీసుకొని, వడిపట్టి ముట్టెత్తాడు. రాత్రి ఎనిమిది గంటలకల్లా అయిదువందల రూపాయిలు వసూలియ్యాయ్. కోటీశ్వరుని కొడుకు ముట్టెత్తితే ఎవరువెయ్యరు.

వెంకన్నకు ఇరస్తా పరస్తా లేకపోవడంచేత, వెంకన్న భార్యకు తలగోరు తానేఆనందంతో పెట్టాడు.

'నీతల్లిదండ్రులు బ్రతికుండగా నీవు మరొకరికి తల గోరు పెట్టకూడదు. అది శాస్త్రవిరుద్ధం' అన్నారొకరుమహా శాస్త్రాలన్నీ చదివినట్లు,

"అయ్యా! శాస్త్రాలను చేసింది మనం; మనల్ని చేసింది శాస్త్రాలు కావు. శాస్త్రాలకు జీవంపోసింది మనం; మనకు జీవంపోసింది శాస్త్రాలుకావు. కాలానుసరణం శాస్త్రం;

శాస్త్రాను సరణం కాలంకాదు. యదార్థానికి అన్ని శాస్త్రాలను, అన్ని కాలాలను దాటిపోయేది ఆత్మ. ఆత్మప్రబోధితమైన జీవితమే ధన్యజీవితము. ఆత్మప్రబోధాను సరణం నడచిన నడవడే మంచినడవడి. కాబట్టి నాఆత్మప్రబోధానుసరణం నేనీ పనిచేశాను. తప్పులేదు' అన్నాడు భద్రం.

'భద్రం! కోటీశ్వరుని కుమారుడవై మావంటి కూలీలలో ఒక కూలివానిలా మాకష్టాలు పంచుకుంటున్నావ్. నీరుణం ఎలా తీర్చుకోగలనో!'' అన్నా తాతకు నవ్వుతూ 'నాదేముంది తాతా! నాకర్తవ్యం నేను చేశాను. నేను కోటీశ్వరునకు పుట్టినంతమాత్రంచేత ఘనతకాని, నీవు పేదవానికి పుట్టినంతమాత్రంచేత న్యూనతకానీ లేదు. మానవుని ఔన్నత్యానికి కారణం గుణంకాని పుట్టుకకాదు. ఎందుకంటే లక్షాధికారికి పుట్టినవాడు మనకళ్ళముందే భిక్షాధికారి ఔతున్నాడు. భిక్షాధికారికి పుట్టినవాడు లక్షాధికారి ఔతున్నాడు. అందుచేత పుట్టుకలో ఏమీలేదు...అయినా తాతా! మనం మొక్కవలసింది ధనవంతులకు కాదు; త్యాగమూర్తులకు. మనం భయపడవలసింది లోకానికి కాదు; భగవానునకు' అని తన హృదయాన్ని వెలువరిచేవాడు.

భద్రం అంటే దరిద్రులకు ప్రాణం; ధనికులకు ప్రాణగండం.

భద్రం రాత్రి ఒంటి గంట దాటాక ఇల్లు జేరాడు. వీధి తలుపు వేసిఉంది: మేడమీాదనుంచి కోటమ్మ దొడ్డి వైపు రమ్మని సైగ చేసింది.

అతడు దొడ్డివైపుగా మేడెక్కి తన గదిలోకి వెళ్ళాడు. దొడ్డి తలుపులు తీసిఉంచి, కావలసిన ఫలహారాలన్నీ సిద్ధం చేసి ఉంచిన కోటమ్మ గదిలో కుర్చీపక్క నిలబడింది.

అతని ఆనందం చెప్పలేను.

'కోటా ! ఏం ఇంకా మేలుకున్నావ్ ?

'నిన్ను చూడాలని.'

కళ్ళు కరువుతీరా కర్మవీరులను చూస్తే కన్నులు మూసుకున్నా కళ్లోకి వస్తారని.

'వచ్చి.'

'వలపు చిలికిస్తారని.'

'చిలికించి...'

'ఎదలోపల ఎదజేర్చి నిదురపోతారని'

'పోయి'

"రాత్రి ఒంటిగంటకు దొడ్డిదోవ వస్తారని. వచ్చి తన ప్రియురాలతో కలిసి భోంచేస్తారని. భోంచేసి నిదర పోతారని... తెలిసిందా ?"

'గట్టిగా తెలిసింది నీవు భోంచేయలేదని.'

'అయితే పద'

'నీవు భోంచెయ్యాపోయావా ?'

'అది హిందూస్త్రీ ధర్మం కాదులే.'

'ఓహోహో ! నీ ముఖానికి ధర్మాలుకూడాను.

"నా ముఖంలో వ్రాసిపెట్టిన ధర్మసూత్రాలు కంఠస్తం చేసే లోకానికి చెబుతున్నావ్. లేపోతే నీకేం వచ్చు ధర్మవన్నాలు."

"అలాగా ?"

'ఆలాగూలేదు; ఈలాగూలేదు పద."

ఇద్దరూ తలుపులు వేసుకొని, ఒకరిపై ఇంకొకరొరిగి కూర్చుని, ఒకే విస్తరిలో, ఆనందంగా భోంచేశారు. తరువాత హాయిగా తమలపాకులు వేసుకున్నారు.

"పెదబాబూ ! బలేపని చేశావోయ్ ! జీవితంలో హృదయం ఉన్నవాళ్ళెవరూ మరచిపోలేరు."

"ఏమిటి ?"

"నీ పరిజాసేవ."

"నివ్వూ చేయరాదూ ?"

"చేయక ?"

"క్రోటి ! మా నాన్న ఏమంటున్నాడు ?"

"నీకేమీా ఆస్తిలో భాగం ఈయడంట,"

"రక్షించాడు."

"నిన్ను ఇంట్లోనుంచి గెంటివేస్తాడంట."

"బ్రతికించాడు. అంతకంటే ఆనందం ఏముంది! అడవి పక్షిలాగ ఏ చెట్టుపెపడితే ఆ చెట్టుమీదే విశ్రాంతి తీసుకుంటూ, ఏ పళ్ళుపడతే ఆపళ్ళు తింటూ, ఏ సెలయేటి నీరు కావాలంటే ఆ సెలయేటి నీరు తాగుతూ, పాడు కుంటూ, ప్రజాసేవ చేసుకుంటూ ధన్యత్వం చెందుతా..."

"నీవేనా ?"

"నీవుకూడా వస్తావా ?"

"రాకపోతే, ఈ పంజరంలో "బానిసత్వం" ఎంతకాలం అనుభవించను ?"

"ఎంతకాలం "స్వతంత్రము" నీలో చివు రించదో అంతకాలం."

"చాల్లే. నిన్ను విడిచి బ్రతకడమే."

"అయితే నాకంటిలో పాపలా నావెంట ఉంటావన్న మాట."

'తప్పక. నీడలో నీడనైపోతా ; నీ చూపులో తీపినైపోతా; నీ హృదయంలో స్పందనాన్నైపోతా...'

'ఇంక'

'ఇంకేముంది ? నీలో కలిసిపోయి, నీవే నేనైపోతా.'

'ఇలా ఏకత్వం పొందడానికి ఏమైనా మంత్రాలు నేర్చుకున్నావా ?'

కావలసినన్ని.

ఏమిటవి ?

ప్రిజానేవా; తద్వారా నీసేవ...

'తద్వారా భగవత్సేవ...అంతేనా?'

చిత్తం

ఇద్దరూ నవ్వుకున్నారు.

కోటీ! నేనో ముష్టివాడ్నైపోతే నన్ను ప్రేమించ గలవా?

ఇప్పుడు ప్రేమించేది నిన్నేకాని నీడబ్బునుకాదు కదూ !

మాటలు నేర్చిన చిలకవు.

చిలక తినే చివురునా

అతడామె లెంపమీద 'ఊ' అంటూకొట్టాడు.

అంతలో అపుడే సినిమానుంచి వచ్చిన ఇంటిపక్క రసికుడు, తన ఇంటిలో "ఆరిపేయవె దీపమూ" అని వందూరి వారి వెంకపాట పాడుకుంటూ ఉన్నాడు.

వీళ్ళిక్కడ ఒకరి కళ్ళు మరొకరు చూచుకున్నారు. ఆ లేత హృదయాలు ఏం మాట్లాడుకున్నాయో కాని కోటమ్మ సిగ్గుతో తలవంచుకుంది.

---

X

పంటకాలవ పక్కన కూర్చొని, కాలవలో కాళ్ళు ఆడిస్తూ, కాలవలో రెక్కా రెక్కా జతచేర్చి పరుగెత్తే బాతులపై నీళ్ళు జల్లుతూ, అల్లరిచేస్తుంది నిర్మల. మధ్య మధ్య పిచ్చిపిచ్చి పాటలు పాడుతూంది.

అంతలో ఒక పొద మాటునుండి:

గీ తం:

పూలు పూలు తోట
వలపు లల్లిన బాట-
మాటలాడ వచ్చావా?
పి ల్ల!
మనసు మార్చవచ్చావా?
పంట కాలువ పక్క
ఒంటరిగ కూర్చుండి—
జంట చేరనిత్తువా?
వ ల పు
పంట కోయనిత్తువా

కన్నూ కన్నుకు చేర్చి,
గుండే గుండెకు చేర్చి—

పాట పాడుకుందామా?
పిల్ల!
ఆట లాడుకుందామా?

నీవు నేనై పోయి,
నేన నీవై పోవ—

'ఎగిరి ఎగిరి పోదమా?
పిల్ల
ఏరు దాటి పోదమా?

• • • • •

నిర్మలా అటూ ఇటూ చెదరిపోయే చూపులతో చూచింది. ఎవ్వరూ కనుపించలేదు. పొదమాటునుంచి పాడే

డెవరో తెలుసుకుంది. కాని అక్కడకు వెళితే పల్చబడి పోదూ? తన బింకం సడలిపోదూ?

అక్కడే కూర్చుంది. ఎంతసేపు కూర్చుంటుంది— చూసింది. చూసింది. ఎంతకూ పాటకాడు రాడు, పాటకాని చూడకుండా వుండలేదు. అందుచేత ఎలా అతగాడ్ని రప్పించనా అని ఆలోచనలో పడింది.

తట్టింది ఒకభావం.

'అమ్మో! అమ్మో! పాము! పాము!"

పెద్ద కేకలు పెట్టింది— తోటంతా దద్దరిల్లేటట్లు.

ఆ దెబ్బతో "ఎక్కడ? ఎక్కడ?" అంటూ బయట పడ్డాడా పాటగాడు—

'అమ్మో! అమ్మో!"

'ఎక్కడ?"

"ఇక్కడే."

'ఏదీ?"

'అదిగో,...అదిగో..."

"ఎక్కడ! కనబడదే."

"కళ్ళుంటేగా..."

ఆమె విరగబడి నవ్వడం ప్రారంభించింది.

'అమ్మదొంగా! ఎంతుఎత్తు ఎత్తావ్!

దొంగల్ని, పట్టుకుంటానికి ఎటువంటి ఎత్తులన్నా ఎత్తాలి.'

"దొంగలెవరు? దొరలెవరు?"

"నీవు దొంగవు; నేను దొరను.'

"అదెలా?"

'మాటునున్నావ్ నీవు; బయటనున్నా నేను.'

నేను కాదు దొంగని; నీవే.'

'ఎలా?"

'నాహృదయ సర్వస్వాన్ని దొంగిలించావ్ కాబట్టి.'

'అలాగా?"

"చిత్తం.'

ఇద్దరూ ఒకరినొకరు చూచుకుంటూ ఉన్నారు. లో లోన నవ్వు పువ్వులు వికసింప జేసుకుంటూ ఉన్నారు.

'రావోయ్! రాము! ఇలా నాపక్కకూర్చో?"

'రామం ఏమిటి? నాపేరు రావన్న'

'మార్చాలే."

'నాహృదయాన్నే మార్చగలిగినదానవు; నాపేరు మార్చడం ఎంత?'

అహా!

అతడు కూర్చోబోతున్నాడు. ఆమె తన అమృత హస్తాలతో అనురాగ కలశాన్ని అందుకోబోతూంది. ప్రేమదేవత తన చల్లని చేతులు చాచి ఆశీర్వదించబోతూంది. కోకిల తన తీయని సన్నాయి సారించబోతూంది. వన దేవతలు పూల అక్షతలు జల్లబోతున్నారు.

అంతలో—

"నిర్మలా! నిర్మలా!"

ఆమె గుమ్మంవంక చూచింది.

"నిర్మలా! నిర్మలా!"

ఆమె లేచి నిలబడింది.

అంతలో—

ఆమె తల్లిదండ్రులు ఆనందంతో తయారయ్యారక్కడకు. ఆమె హృదయం ఝల్లుమంది; లోలోన కార్యమని వచ్చిండి.

"నిర్మలా! నిర్మలా!"

ఏం నాన్నా!

నీ సంబధం కుదిరింది.

"సం...బం...ధం!!!!!!!"

నిజం—చాలా గొప్పవాడు. లక్షల కధికారి. బహు చక్కని వాడు.

ఎవరు?

నీ కాబోయే భర్త

నా కాబోయే భర్తా!

అవును నిర్మలా!

నిర్మల రావన్నవంక చూచింది. రావన్న ఆ మాటలు విని కొబ్బరిచెట్ల మాటుకు వెళ్ళిపోయాడు.

నాన్నా! సంబంధం ఖాయంచేశారా?

ఆహా!

ఎవర్నడిగి చేశారు?

ఎవర్నడగాలి?

నన్నడగవద్దూ?

'రామం ఏమిటి? నాపేరు రావన్న'

'మార్చాలే.''

'నాహృదయాన్నే మార్చగలిగిన దానవు; నాపేరు మార్చడం ఎంత?'

అహా!

అతడు కూర్చోబోతున్నాడు. ఆమె తన అమృత హస్తాలతో అనురాగ కలశాన్ని అందుకోబోతూంది. ప్రేమ దేవత తన చల్లని చేతులు చాచి ఆశీర్వదించ బోతూంది. కోకిల తన తీయని సన్నాయి సారించ బోతూంది. వన దేవతలు పూల అక్షతలు జల్ల బోతున్నారు.

అంతలో—

"నిర్మలా! నిర్మలా!''

ఆమె గుమ్మంవంక చూచింది.

"నిర్మలా! నిర్మలా!''

ఆమె లేచి నిలబడింది.

అంతలో—

ఆమె తల్లిదండ్రులు ఆనందంతో తయారయ్యా రక్కడకు. ఆమె హృదయం ఝల్లుమంది; లోలోన కల్యామని పడ్చింది.

"నిర్మలా ! నిర్మలా !"

ఏం నాన్నా !

నీ సంబధం కుదిరింది.

"సం...బం...ధం ! ! ! ! ! ! !"

నిజం—చాలా గొప్పవాడు. లక్షల కధికారి. బహు చక్కని వాడు.

ఎవరు ?

నీ కాబోయే భర్త

నా కాబోయే భర్తా !

అవును నిర్మలా !

నిర్మల రావన్నవంక చూచింది. రావన్న ఆ మాట విని కొబ్బరిచెట్ల మాటుకు వెళ్ళిపోయాడు.

నాన్నా ! సంబంధం ఖాయంచేశారా ?

ఆహా !

ఎవర్నడిగి చేశారు ?

ఎవర్నడగాలి ?

నన్నడగవద్దూ ?

ఎందుకు ?

"పెళ్ళికూతురు ఇష్టం లేకుండానే పెళ్ళా—పెళ్ళి—పెళ్ళి— ఎవరికి ? నాకూ మృత్యువునకా పెళ్ళి—పెళ్ళంట పెళ్ళి." ఆమె తారాజువ్వలా లోపల కెళ్ళిపోయింది. రాఘవన్న తాటితోపుల్లోకి వెళ్ళిపోయాను.



అటు ఆ ప్రియులగతి—
ఇటు ఈ ప్రియులగతి—



అటు కార్మిక కర్షకులగతి—
ఇటు కోటీశ్వరుని గతి—



ఏమౌతాయో దీని తరువాతభాగం.



# స్వతంత్రం

## FREEDOM.

చదవండి. చదివి మీ ఉద్దేశాలు నా ఉద్దేశాలకు భిన్నంగా ఉంటే వ్రాయండి. సంతోషిస్తా,

మీ

జంపనే



# జాపనవారి రాబోవు గ్రంథాలు

1. దేవుడున్నాడా?
2. దేవుడు లంచగొండా?
3. దేవునికి పూజాల్లెందుకు?
4. శాస్త్రాలెందుకు?
5. ఆచారాలెందుకు?
6. లమలా లెందుకు?

♦ ♦

7. స్త్రీసంఘంలో బానిసా?
8. స్త్రీపిల్లల్నికనేయంత్రమా?
9. స్త్రీచదువుకోరాదా?

♦ ♦

10. పేదసాదలు
11. కార్మికులకష్టాలు
12. కర్షకులకష్టాలు
13. ఎదురీత
14. గుమస్తా
15. నేటి బి. ఏ. లు
16. కోటివిద్యలుకూటికొరకే

♦ ♦

17. తల్లిలేనిపిల్ల
18. ఎవరికివారేయమునాతీరే
19. కోటీశ్వరుడు
20. భూలోకస్వర్గం

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:-

**రాజహంస బుక్ డిపో, రాజమండ్రి.**

Title Printed at "RAJAHAMSA" Rjy. Q. H. No. E. G. 54.
D/ 8—2—'46 Copies-750.